# యుద్ధం మీద ఉచ్చ పోసిన పిల్లవాడు!



వ్లాదిమీర్



# యుద్ధం మీద ఉచ్చ పోసిన పిల్లవాడు!

ఒక చిన్న పిల్లవాడు ఒక పెద్ద యుద్ధాన్ని ఆపగలడని తెలుసా!

ఎలా?

ఆ చిత్రమైన కథ తెలుసుకోటానికి ఈ పుస్తకంలోకి వెళ్లండి!



చాలా రోజుల నాటి
సంగతి, ఎత్తు గోడల
వెనక ఒక అందమైన
పట్టణం ఉంది.

అదిగో అది ఇలాగే ఉండేది.



ఆ పట్టణంలో అమ్మా, నాన్నలతో ఒక చిన్న
పిల్లవాడు ఉండేవాడు. అమ్మా, నాన్నలు
అతడిని ఎంతగానో ప్రేమించేవాళ్లు.



అమ్మ ఎప్పుడూ అతడిని
ముద్దు పెట్టుకుంటూ ఉండేది.
తండ్రి రోజంతా అతడితో
ఆడుకుసేవాడు.



ప్రతి రోజు అమ్మా, నాన్నలతో కలిసి పిల్లవాడు

పూల బజారులో తిరిగేవాడు.

భలే! ఎంత అందమైన పూలు!

భలే! ఎంత అందమైన జీవితం!

వాళ్లంతా ఎంతో సంతోషంగా ఉన్నారు.





అంతలో జరగరానిది జరిగింది.

# యుద్ధం!

అందమైన ఆ పట్టణాన్ని నాశనం
చెయ్యటానికి శత్రువులు వచ్చారు.

అందమైన ఆ పట్టణం చూసి వాళ్లకి
అసూయ కలిగిందేమో.
అయ్యో, ఎంత భయంకరమైన యుద్ధం.



ఆ విధంగా పెద్ద పోరు మొదలు

అయ్యింది. ఒకరిపై ఒకరు దాడులు

చేస్తున్నారు.

పగలూ, రేయి అన్న తేడా లేకుండా
ఆ యుద్ధం సాగుతూనే ఉంది.

# ఎంతటి విషాద పట్టణం!





వీధులలో పిల్లల ఆటలు లేవు.

బజారులలో పూలు లేవు.

ఎక్కడా, ఎవ్వరూ నవ్వటం లేదు.



పిల్లవాడికి ఇప్పుడు సంతోషం లేదు.

తనతో ఆడుకోటానికి నాన్న లేడు,

ముద్దులు పెట్టే అమ్మ లేదు.

వాళ్లు ఎక్కడికి వెళ్లారు?

పిల్లవాడు వాళ్లని పిలిచాడు,

కానీ ఎవ్వరూ రాలేదు.

పిల్లవాడు అన్ని చోట్లా చూశాడు.
కానీ అతడికి అంతటా యుద్ధమే
కనపడింది, చివరికి పట్టణం గోడ మీద
కూడా యుద్ధమే జరుగుతోంది.



అన్ని వైపులా శబ్దాలే.

ఢాం, ఢాం.



క్లింగ్-క్లాంగ్!

పాపం, పిల్లవాడు బాగా భయపడిపోయాడు!
అతడికి అమ్మా, నాన్నా కావాలనిపిస్తోంది.
అన్నిటికీ మించి ఆ సమయంలో...

...ఉచ్చ పోసుకోవాల్సి వచ్చింది!

అతడు ఏమాత్రం ఆపుకోలేకపోయాడు.

అక్కడే ఉచ్చ పోసేశాడు...



ఢాం ఢాంల మీద అతడు ఉచ్చ పోశాడు.

అటు తిరిగి, ఇటు తిరిగి ఉచ్చ పోశాడు!

అతడు చిన్న పిల్లవాడు, అతడిని

మన్నించండి!





ఉన్నట్టుండి అంతా ఆగిపోయింది!

అప్పుడు ఎవరో నవ్వారు.

హ హ హ హ హ

హి హి హి

హి



తరవాత

హో హో హో హో హో

కొంత సేపటికి అక్కడ
ఉన్న అందరూ పడీ పడీ
నవ్వసాగారు.





అలా అందరూ నవ్వుతూనే ఉన్నారు. సూర్యుడు
అస్తమించాడు. ఆకాశంలో చుక్కలు పొడిచాయి.
నవ్వి, నవ్వి ప్రజలు ఎంతగా అలసిపోయారంటే,
ఎక్కడి వాళ్ళు అక్కడే పడి నిద్ర పోయారు.
ఆ మరునాడు వాళ్ళు నిద్ర లేచేసరికి యుద్ధం
ఆగిపోయింది. ఎందుకు?
ఆ అద్భుతమైన పిల్లవాడి కారణంగా.

భళా!



చివరికి...

పిల్లవాడికి అమ్మా, నాన్నా తిరిగి కనపడ్డారు.

స్వర్గం నేలకి దిగి వచ్చినట్టు ఉంది.

అందరూ సంతోషంగా ఉన్నారు.

పట్టణంలోని వాళ్లందరూ ఆ పిల్లవాడిని ప్రేమించసాగారు.

తమ పిల్లలు, వాళ్ల మనవలు గుర్తుంచుకునేలా ఆ పిల్లవాడి

కోసం ఒక కాంస్య విగ్రహం చేయించాలని అనుకున్నారు:

యుద్ధం మీద ఉచ్చ పోసిన పిల్లవాడు.





ఆ విగ్రహమే

# మన్నెకెన్ పిస్

ఇది ఫ్రెంచి పదం, దీని అర్థం "ఉచ్చ పోస్తున్న పిల్లవాడు"

ఇదంతా చాలా రోజుల క్రితం **బెల్జియం** అన్న దేశంలో

**బ్రసెల్స్** అన్న పట్టణంలో జరిగింది.





మీరు ఎప్పుడైనా ఆ విగ్రహాన్ని చూస్తే దాని వెనక కథ మీకు తెలిసింది. ఈ కథని మీ పిల్లలకు చెప్పండి, వాళ్లు వాళ్ల పిల్లలకు చెపుతారు, వాళ్లు వాళ్ల పిల్లలకు చెపుతారు, అలా, అలా ఇది కొనసాగుతూనే ఉంటుంది.







మన్నెకిన్ పిస్
యుద్ధం మీద ఉచ్చ పోసిన పిల్లవాడు!